# అహింస. 15

# अहिंसा



మద్రాసు.

ఆనందముద్రణాలయమందు

ముద్రితము.

---

1922.




శ్రీ కృ

# అహింస.



అహింసా పరమోధర్మః, యని మనవేదములం యందును స్మృతి పురాణాదులయందును జెప్పఁబడియున్నది. ఈయహింస యనువిషయము గూఁడ సత్యమను విషయమునవలె నిరూపించుటకుఁ గష్టసాధ్యమయి యున్నది. ముందుగా ఈవిషయమున మనపురాణాదులలో నేమి చెప్పఁబడియున్నదో విచారించి యాపయిని హింసయనఁగా బాధించుటో లేక చంపుటయో అని చర్చింపవలసి యున్నది.

ఈ విషయమున శ్రీ మహాభారతములో ధర్మరాజు భీష్ములవారితో, దేవతలును బ్రాహ్మణులును నహింసను మిగులఁ బ్రశంసింతురు-దానివిషయము చెప్పు, మని యడిగెను - భీష్ములవారిట్లు చెప్పిరిఁ - ఏనుఁగు పాదమునఁ దక్కిన జంతువుల పాదములన్నియు నిమిడినట్లు ధర్మములన్నియు నహింసకు

లోఁబడి యుండును - అయ్యహింసయు నాలుగు పాదములుగల గోవువలె నాలుగు విధములయి యుండును-అందొకటి తప్పినను ధర్మము కుంటువడును-మనోవాక్కాయములచే హింసను నడపుటయు మాంసభక్షణమును గలిసి నాలుగు తెఱఁగులు-ఈనాలుగు తెఱఁగుల హింసను మానుటయే పయిని జెప్పఁబడిన యహింసయొక్క నాలుగు విధములు-మాంసము రుచిని మరగినవాడు దానినెట్లు మానఁగలఁడు. కావున నేవిధమున నయినను మాంసముపయి నాసక్తిని విడుచుటయే యహింస యనఁబడును.దీనిపయిని ధర్మరాజు ప్రశ్నము మాంసము పితృదేవతలకుఁ బ్రియమనియు శ్రాద్ధమున మాంసము ముఖ్యమనియుఁ జెప్పుదురుకదా జంతువధ చేయక మాంసలాభ మెట్లుకలుగును? దీనికుత్తరము 'అశ్వమేధము కన్నను మాంసభక్షణమును విడుచుట మిగులఁ బూజ్యము. చంపుటయు చంపించుటయు పాపము లన్నిటికన్న నధికములు, పితృకార్యములు యజ్ఞములు మొదలగు వానియందు

వేదచోదితమయిన హింసవలనఁ గీడుగలుగదు. రుచి
నిగోరి మాంసము దిన్నచోఁ బ్రాణిని జంపినట్లు
పాప మధికమగును – తన్ను నమలినవానిని మాం
సము నమలునని వేదములు చెప్పును. మాంసభక్షు
ణమును విడుచుట యొక్కటియుఁ దపమునకు
సమానమని శ్రుతులు పలుకును మాంసమురుచిని
మించిన రుచిలేదు కావున చవియెఱిఁగి దానిని విడి
చినవాఁడు దేవసమానుఁ డని ధార్మికులు చెప్పు
దురు. ప్రాణుల శరీరములయందుఁ గాక శిలలయం
దును ద్రుమానియందును మాంసము గలదా? అట్టి
ప్రాణుల శరీరములను బాధించు నపుడు తన శరీర
మునకు బాధగలిగిన నెట్లుండునో దాని నూహింప
రాదా? అందువలన గానిని మానిన యెడల హింస
లన్నియు మానునని దయార్ద్ర బుద్ధియయిన
యుత్తముఁడు హింసను మానును. మాంసమును
భక్షింపకుండుట ప్రాణివధాసక్తిని విడుచుటయే
యగుటవలన నట్టివానికి సర్వభూతముల వలనను
నభయము గలిగి యుండుట నిజము. స్వాయం

భుపుడను మనువు లోక హితార్థము దీనిని జెప్పె ను. మార్కండేయాదిమునులుగూడ మాంసవర్జ నమువలన నాయువు సంపద సౌందర్యము గలుగున నిరి. ఇంతియకాక మాంసము గోరువాడు దను జుండే అని పలికిరి.

ఈ పై భీష్ములవారి వాక్యమువలన హింస యనం గా బాధించుటయు చంపుటయునని మిశ్రముగాం గనంబడుచున్నది. ఆహింసను నాలుగు విధములుగ విభజించిరి. అందు మొదటి రెండువిధములు నొకరిని బాధించునవి కాని చంపునవి కావు. తానుచంపక పోయినను మాంసమును విడుచుట నాలుగవదిగాం జెప్పిరి. అనంగా తాను తినునపుడు వేఱొకడు చంపవలసి వచ్చును.

పూర్వము మాంసభక్షణమునువిడుచుటవలన దే వతలు దనుజులవలని భయమువలన విడువంబడిరని భీష్ములవారు చెప్పిరి. అట్టి దేవతలకు మనము యజ్ఞ ములయందు పశువధయేల చేయవలయునో సరియగు కారణముగానరాదు. మఱియు దానముధర్మమ

తపము యజ్ఞమునను నవి యహింసయొక్క యాకా
రములని చెప్పఁబడియున్నది. ఈవాక్యమువలన హింస
యనగా ప్రాణిని బాధించుటయని తోఁచుచున్నయది.
సగర నల దిలీప నృగ భగీరథాదులగు పూర్వరాజు
లు వర్షకాలము నాలుగునెలలును మాంసమును
విడుచుటచే నిందు సందు నున్నతిగాంచిరని చెప్పిరి.
ఎప్పుడును మాంసము తినఁగూడదని చెప్పినభీష్ముల
వారు చాతుర్మాస్యములో నయినను విడువుమని
యేల చెప్పిరో విచారింతము. ఆదినములలో రాజులు
స్వయముగ వేఁటలో వధించినవానినే తినుచుండి
నట్లు స్పష్టపడుచున్నది. ఆనాలుగునెలలలో వేఁట
లాడఁ గూడ దనుటకుఁ గారణమేమనఁగా? అది
యడవిలోని యనేక జంతువులు పక్షులు, గర్భము
దాల్చి పిల్లలను గను కాలమైయున్నది. ఆదినము
లలో నాఁడు వానిని జంపిన యెడల నాయాజాతి
జంతువులవృద్ధికిఁ జాలవఱకు నష్టముగలుగును కా
వున నట్టివృద్ధిని క్షీణింపఁజేయకుండుటయే. ఈనాలు
గునెలలు వేటమానుమని చెప్పుటచే తదితరమాస

ములలో వేఁటనొప్పినవారే యయియున్నారు. ఇట్లనే కొన్ని దేశములలో నాఁడుమృగములను పక్షులలో గ్రుడ్లుపెట్టి పిల్లలుచేయుమాసములలో వానిని జంపకుండ రాజశాసనములు గలవు.

మఱియు మాంసము దిటవలన సంభోగాసక్తనకు బలముగలుగును. మార్గశ్రమ చెందినవాఁడు తేరుకొనును గాయముత్వరలో మానును. బలహీనునకుఁ బుష్టి గలుగు ననియు అగస్త్యుఁడు రాజులకు వేఁటవిధించెను గావున లోకహితార్థముగా క్రూరమృగవధచేయవచ్చు ననియు స్వహస్త విక్రమార్జిత మాంసమును భక్షింపవచ్చుననియు కేవల జీవనార్థమై జంతువధ చేయఁ గూడదనియు అయినను మాంసభక్షణమును మానినవాఁడుత్తముఁ డనియు భీష్ములవారు చెప్పిరి. ఏధర్మములయినను దయకు సదృశములు కావనియుఁజెప్పిరి.

ఈవాక్యమునుబట్టి చూడగా చంపకపోవుటయే కాక బాధ చేయకుండుటయు నహింసలో చేరునని స్పష్టపడుచున్నది. దయగలవాఁడొకరిని హింసపెట్ట

నా? కేవలము చంపుటయే హింసయని తీసికొంద
మనినచో. ఓషధులు లతలు పశువులు మృగములు
పక్షులు లోకమున కాహార పదార్థములని వేదము
లో జెప్పబడి యున్నది. మఱియు కృషి చేయువాడు
నాగలిచే దున్నునపుడు భూమిలోనున్న యనేకజం
తువులను జంపును. ధాన్యపువిత్తులు మొదలగునవిజీ
వస్వరూపములుగావా? వృక్షములు నోషధులు ఛే
దింప బడునపుడువాని యందును ఫలములయందును
జీవములు లేకపోయినవియా? నీళ్లలోను ననేక జీవ
ములు గలవు. సమస్తముజీవులచేవ్యాప్తమయియు
న్నది. అనుభవములో ప్రాణులన్యోన్య భక్షణము
వలన జీవించుచున్నవి. మనము నడచునపుడు నేల
నున్న యనేక ప్రాణులను త్రొక్కి చంపుచున్నా
ము. బుద్ధిపూర్వకముగాఁ గాకయు హింస చేయఁ
బడుచున్నది-బాగుగ నాలోచించినచో పై విధమ
మున హింసను చేయనివాఁ డొక్కఁడును లేఁడు.
నహింస్యాత్సర్వాభూతాని, యని శ్రుతిగలదు.
దీనిని బట్టిచూడగా శ్రమపఱచుటయే హింసయని

స్పష్టపడుచున్నది కేవలము చంపుటయను నర్థ
మందు-వధ, హత్య. యను పదములు వాడుక
చేయఁబడుచున్నందున హింస యనఁగా బాధయని
యే తీసికొనవలసి యుండును. అట్టి స్థితిలో వేఁట
యందు చంపుటనే భీష్ములేల బలపఱచి చెప్పిరో
చూడవలసియున్నది - చంపుటకూడ హింసయని
చెప్పుటలో సంశయము లేదు-ఈధర్మరాజు ప్రభు
త్వమును జేయఁబూనుకొని యున్నాఁడు-ఇతఁడు
దయాళుడు సత్యవంతుడు కావున జీవములకు హిం
సను జేయఁడు-రాజగుటచే విధివిహితమయిన వేటను
జేయును. అందునుండి యట్టిహింసను గూడమాన
మని చెప్పుచు అప్పటి యాతని వయస్సునుబట్టి కే
వలము వేటమానడేమోయని పయిని జెప్పిన నాలు
గు మాసము లయినను మానుమనియు నట్లుమాని
న వాడుత్తమ లోకములకు బోవుననియు జెప్పిరి
రుచి యెరిగి మాంసము మానుమని చెప్పుటవలన
వెంటనే మాంస విసర్జనము చేయుమని యభిప్రా
యముగాదు-నాలుగు మాసములు మితినేర్పరచిన






డుః కొ... ...నియు అప్పుడు మాంసభక్షణము... ...నంతట తానే విడుచు కొనునని యు నూహించి యిట్లుచెప్పినట్లు స్పష్టప డుచున్నది.

ఇతరజంతువుల హింస యటుండగా కొన్ని కుటుంబములలో తల్లి భార్య బిడ్డలు తోబుట్టువులు మొదలగు నింటిలో నివారిలో నొకరిమాట వినుటవలన నింకొకరిని తిట్టుట కొట్టుట మొదలగుబాధలు పెట్టుచున్నారు. భార్యమాటవిని కన్నతల్లి నిసహా కొట్టువారుకొందరుగలరు. ధనవంతులయినవారుకొందరు చక్కగ భోజనపదార్థములను జాగ్రత్తపరుపక లోభముచేతాము బాగుగదినక యింటిలోనున్న యందరికిని యట్టిభోజనమునే పెట్టుచు వారలకు తగినధనమును నెలకొ క్కలకీయక శ్రమపరుచుచున్నారు అందుచేవారు పయిగాఋణములుచేసి బాధలు పడుచున్నారు 'హింసచేయ'మనియు చేయగూడదనియు జెప్పుచున్న పండితులు తమగృహములలో కు

టుంబమువారిహింసలను ముందుగమాన్పి తదితరు
లకుపదేశించుట చేయదగిన పనియైయున్నది

ఈపయివిమర్శమువలన నేజంతువులకును సాధ్య
మయినంతవరకు శ్రిమపరుపకుండుటయే యహింస
యని తేలుచున్నది. అయినను బాధకములైనజం
తువులను అనగా క్రూరమృగములు విషజంతువు
లు వీనిని జంపుటలో పాపములేదు. అందునుండియే
కదాకొన్నిమాసములు జంతువధ చేయ గూడదను
రాజశాసనములున్న చోటులనుగూడ క్రూరమృగ
వధ కట్టినిబంధనలేదు.

అయితే క్రిమికీటాది స్వల్పజంతువులను జంపుట
వలన పాపము తక్కువయనియు, కుళ్లినపదార్థము
లలోనుత్పన్నము లయినవానిని జంపుటవలన మేలే
కాని పాపములేదనియు ఎండిపోయిన చెట్లువంటచె
రుకునకేకాని వేరుగనుపయోగింపవుకావున మంచిస్థి
తిలోనున్నవృక్షముల నుపయోగార్థము నరకుట
లో పాపములేదనియు తెలియదగియున్నది.

మరియు మాంసభక్షణము చేయువాడు జీవనార్థ ము వేటలాడగూడదనియు తాను పెంచిన జంతువును తానుచంపుట చంపించుట కూడదనియునీ రెంటిని మాంసభక్షకుడగు ప్రతివాడును సామాన్యనీతి గా మనస్సునందుంచుకొనవలయును. అట్టివాడు క్ర మముగహింసనే మాని తరించును. కొందరు వినో దార్థము వేరొకరిని హింసించుటకలదు దానినిమా నుట సాధారణజనులకు సాధ్యముగాదు అయితే ఆ హింసను మనస్సునకు నొచ్చునట్లు చేయగూడదు. మరియు వాచస్పత్యనిఘంటువులో ఆహింసాశబ్దము నకు 1వాఙ్మనఃకాయములచే పరులనుపీడింపకుండుట

2 ప్రాణులను పీడింపకుండుట

3 అశాస్త్రీయ ప్రాణీపీడచేయకుండుట

అనిమూడువిధములుగ నర్థము వ్రాయబడియున్నది ఇందు మొదటిది మనోవాక్కులను గలుపుటవలన మనుజులకొరకు మనుజులుచేయు పీడనుద్దేశించి చె ప్పబడియున్నది. రెండవది ప్రాణిపీడానివృత్తియని చెప్పుటచేమనుష్యేతర ప్రాణులనుగూర్చి మనుష్యు

లు చేయుపీడను ద్దేశించిన ట్లేర్పడుచున్నది, మూడవ
ది అశాస్త్రీయపాణిపీడ చేయకుండుట అని చెప్పు
టవలనయజ్ఞాదుల యందు పశువధ కంగీకరించిన
ట్లేర్పడును రాజులకు వేటయనునది విధిగజెప్పబడి
యున్నందున రాజువేటచేయుటలో తప్పులేదు అ
టుల వారిచేజంపబడినజంతువులకు సద్గతిగలదని
చెప్పబడియున్నది. అయినను వధరూపమైనవేటను
రాజుల కెందుకునియమించిరో యోచింతము.

సామంతులుగ నుండురాజులు శరీరపరిశ్రమవి
షయమున తరుచుగ నశ్రద్ధచేయుదురు కావున వేట
లకు బోయినప్పుడు తరుచుగ గుఱ్ఱము నెక్కకతప్ప
దనియు వేటస్థలమున చాలవరకు నిమ్నోన్నత ప్ర
దేశములలో నడచుట సంభవించుననియు కొండల
వేటకు బోవువారికి వానినెక్కుట దిగుట తటస్థము
గుననియు బాణములతోగాని తుపాకులతోగాని వే
యుటవలన చలలక్ష్యశుద్ధియు, చురుకుదనమును గు
దురుననియు జంతువుల కొరకు కనిపెట్టియుండుటవ
లన ఓరిమి, నెమ్మది, పట్టుదల, శ్రమకోర్చుట, మనో

ార్థ్యము మొదలగుగుణము లలవాటుపడుననియు ంగములు గల వానిలో మగజంతువులనుజంపు ) స్త్రీజంతువులను విడుచుట వలనను పందులలో ్గలతో వచ్చువానిని విడుచుటవలన విచక్షణ స్వ ావము, దయారసము, నలవాటు పడుననియు వే ్రో జంతువులను దోలవచ్చు సామాన్యజనుల క ుఖములను వినుట కవకాశము గలుగుననియు ాభముల కొరకు రాజులకు వేట విధింపబడినది. ుకాండ౧లో నరుదుగ నొకరిద్దరు కూర్చుని యు పక్షిని నిలువబడియున్న జంతువును వేయనట్లు ియవచ్చినది-విధి విహితమయినను వేటను రా ు వ్యసనముగా దీసికొనగూడదు- 'అతిసర్వత్రవ మేత్, వయః పరిపాకమయిన పిమ్మట క్రమము ానిని విడుచుకొనుట యుక్తముగ దోచుచు ది.

వేటలయందు జంపబడు జంతువులకు సద్గతి గల యు రాజులకు హింసయనగా దండింపదగిన వా దండింపకుండుట, దండనార్హులు గానివారిని

దండించుట, బ్రాహ్మణుని మనస్సునకు నొప్పిత
లునట్టి పనిచేయుట, అనపరాధియైన వానిని శిక్షి
చుట, యని నాలుగు తెరగులయి యుండునని శ్రీ
మహా భారతములో మరియొకచోట జెప్పబడి
యున్నది.

పయివిధముగా నీయహింసా విషయము య
థామతిగా విమర్శించి వ్రాయబడియెను.

బొబ్బిలి.
30-1-1922.

V. S. R.

